"ఈ రాజ్యాంగపరిషత్తు తన వ్యవహారనియమావళిని నిర్ణయించుటకును, కమిటీలను నియమించుటకును పూనుకొని పనిసాగించవలసియున్నది. జాతీయ స్వప్న మనోరథములకు లిఖితప్రమాణమైన స్వరూపమును చిత్రించవలసియున్నది. మన లక్ష్యమేదో, మనము సాధింప సమకట్టినదేదో, మన మెటువైపుకు నడక సాగించుచున్నామో, ఈ పరిస్థితిలోకూడ మనకు మనము నిరూపించుకొనవలెను. మనవైపు చూపునిల్పి నిరీక్షించుచున్న కోట్లకొలది జనులకొరకును, యావత్ప్రపంచము కొరకును మనము నిరూపించవలెను.

ఇది మన నిశ్చితార్థ ప్రకటన. ఇది మన సంకల్పము. ఇది మన దీక్షాప్రమాణము. ఇది మనము జేసెడి ఒప్పందము. మన కందరికిని వర్తించెడి ఆత్మసమర్పణము. ఈ తీర్మానము భారతదేశప్రజల మనోభీష్టమును, హృదయమును ప్రతిఫలింపజేయుచున్నది."

"సహకారము, సద్భావము, స్నేహభావము ఇవి అత్యంతావశ్యకములు. భారతదేశము బ్రిటనుతో సహకరించవలెనని, స్నేహముగా ఉండవలెననియే కోరుతున్నది. బ్రిటను భారతదేశసహకారాన్ని తిరస్కరిస్తే రెండు దేశాలకూ అందువల్ల అపకారమే జరుగుతుంది. కాని భారతదేశానికి కంటే బ్రిటనుకూ, ప్రపంచానికే ఎక్కువ హానికలుగగలదు."

---

## కొత్తరకపు సేఫ్టీరేజర్

అమెరికాదేశంలోని 'రోచస్టర్' పట్టణంలో నివసించే యం. యం. గ్రెవిన్ అనేవాని గెడ్డం - సంగతి తెలియక ఒప్పుకున్నా - మంగలివరూ, కత్తులు బండబారిపోడంవల్ల రెండోసారెప్పుడూ గీసేవారు కాదు. అతనిది అంత బిరుసుగెడ్డం. అంచేత అతనే వేడినీళ్లలో ముంచిన బ్లేడుతో చేసుకునేవాడు. అది సుఖంగా ఉండడంవల్ల గడ్డం గీసుకున్నంతసేపూ వేడిగా ఉండే సాధనం కనిపెట్టడానికి తంటాలుపడేవాడు. అతని భార్య వేడిసేఫ్టీరేజరు కనిపెట్టరాదేమిటని ఆక్షేపించడం, మంగలివరూ గెడ్డం గియ్యకపోడం ఈ రెండూ ఈ కొత్తరకపు వేడిసేఫ్టీరేజరు కనిపెట్టడానికి కారణాలయినాయి. అత డలా శ్రమపడి పడి, మూడేళ్లు సాగించిన పరిశోధనల ఫలితంగా, గెడ్డం గీసుకునేంతసేపూ బ్లేడు వేడిగా ఉండే సాధనం కనిపెట్టగలిగాడు ఆఖరికి.

ఆ బ్లేడ్ ఎలెక్ట్రిసిటీవల్ల ౧౪౦ డిగ్రీల వేడి ఎక్కుతుంది. అది అదుర్లకు ఆగగలదిగాను, నీళ్లకు తడియనిదిగాను ఉంటుంది. ఆ వేడి అక్కర్లేనప్పుడు గాలికి చల్లబడిపోతుంది. ౧౪౦ డిగ్రీల వేడి కలగగానే ఆ బ్లేడు అంచు చివర నున్న అణువులలో ఎక్కువ సంచలనం (మనం ఊహించలేనంత) కలుగుతుంది. అంచేత బ్లేడు అంచు మరీ పదునెక్కి మెత్తగా తెగుతుంది. ఒకవేళ చిట్లినా, బీటలు, నాటులు పడి రక్తం వచ్చినా బ్లేడులో ఉన్న వేడివల్ల వెంటనే ఆ నాట్లు మాని, మంట మొదలైన బాధలేమీ కలగవు. సుఖంగా ఉంటుంది. దీనికి వేడినీళ్లూ, తువ్వాలూ మొదలైన గొడవ, అడావిడీ ఏమీ అక్కర్లేదు.

ఇది కనిపెట్టి రెండేళ్లయినా యుద్ధంవల్ల ఊపిరిలేని రోజులు గనక ఇంకా తయారుకావటం లేదు. ఇంకకొద్దిరోజుల్లో మన హస్తాల నలంకరిస్తుం దీరేజర్.

శ్రీరామశాస్త్రి





# విమర్శనము



### అమరజీవులు

నాల్గుభాగములు. మంత్రవాది సంపాదితములు. తెనాలి సుందరరాం అందు సన్ను ప్రచురణలు.

పసిపిల్లలను సన్మార్గవర్తనులను జేయుటకును, వారికి మహత్తమ ఆదర్శములను బోధింపజేసి నీతిమంతులను జేయుటకును అమరజీవులైన మహాపురుషుల జీవిత చరిత్రలు మిక్కిలి తోడుపడగలవు. అట్టి ఉద్దేశ్యముతోనే వ్రాయబడిన ఈ చిన్నపుస్తకములు ప్రాథమిక తరగతులలోని విద్యార్థులకు తరగతి క్రమమున బాగుగా ఉపకరించునవై యున్నవి. అనేక వర్గములకు, అనేక శాఖలకు చెందిన పలువురి జీవితగాథలు వీనిలోనున్నవి. కొందరు స్త్రీరత్నముల చరిత్రములుకూడ గలవు. కాని ఈ చరిత్రల వర్గీకరణములో కొందరి చరిత్రల పునరుక్తి, కొందరి చరిత్రల లోపము లేక వీలయినంత సమగ్రముగా ఉండియుండినయెడల ఇంకను బాగుండెడిది.

### తెనుగుతల్లి

రచయిత: మాగంటి బాపినీడుగారు. ప్రకాశకులు: జాతీయ జ్ఞానమందిరం, త్యాగరాయనగర్, మద్రాసు ౧౭. వెల రూ. ౨.

తెలుగుదేశాన్ని గురించి సాకల్యంగా చిన్నపిల్లలకు వారి చిన్నారిభాషలో చిత్రమయంగా తెలియజెప్పడానికై చేసిన ప్రయత్నం ఇది పిల్లలపుస్తకాలు, ఇతరప్రాంతాల్లోవలె, ఆట్టేలేని ఎనకు ఇటువంటివి చాలాచాలా అవసరమనడం ఎవరూ కాదనరు. కాగా, బాపినీడుగారి ఈ యత్నం తప్పక సర్వథా కొనియాడదగింది. దీని నిర్మాణంలో వారి ఉత్సాహం బాగా ద్యోతకమవుతున్నది కూడా. కూర్పు తీర్పులుకూడా మహా ముచ్చటగా ఉన్నాయి. కాని, ఆంధ్రబాలసర్వస్వం అని దీన్ని పేర్కోవడం మాత్రం అంత సమంజసం కాదేమో అనిపిస్తున్నది. ఎన్నో విషయాలు ఇందులో లోపించి, దీనికి అసమగ్రత కల్పిస్తుండడం నిజంగా విచారకరవిషయం ఉత్తర ముద్రణంలోనైనా దీనికి ఆ సమగ్రత కల్పిస్తారని ఆశిస్తున్నాము

## గ్రంథ స్వీకారము

### జంతుశాస్త్రము

గ్రంథకర్త: ఆర్. వి. శేషయ్య, యం. ఏ. గారు. ప్రకాశకులు: ఆంధ్రవిశ్వకళాపరిషత్తు, వాల్తేరు. వెల రూ. ౫-౮-౦.

### శిల్పదర్శనము

గ్రంథకర్త: కొండూరు వీరరాఘవాచార్యులుగారు. ప్రకాశకులు: విశ్వజ్ఞమండలి, తెనాలి. వెల రూ. ౨-౮-౦.

### ఆత్మోపహారము

కవి: బులుసు వేంకటేశ్వర్లుగారు, బి. ఏ., రామారావుపేట, కాకినాడ. వెల అ. ౮.

### రంగవల్లి

పోటీకథలు. ప్రకాశకులు: సాధన సమితి, ౬౭౮౨ ఇమాంబావివీథి, సికిందరాబాదు. వెల పావలా.

### ఆంధ్ర రాజభక్తులు

గ్రంథకర్త: అండ్రశేషగిరిరావుగారు, బి. ఏ., వెల అ. ౧౨

### ప్రవాసి

చిన్నవల. కర్త: శ్రీపతి నరసింహారావుగారు, బి. ఏ., వెల అ. ౧౨.

### ప్రేమాంజలి

టాల్‌స్థాయికథకు అనుకరణ. కర్త: ముద్దా విశ్వనాథంగారు. వెల అ. ౧౨.

పైమూటికి ప్రకాశకులు: జయనికేతనం, మద్రాసు ౭.

### ప్రసూనాంజలి

కవి: దూపాటి వెంకటకృష్ణ రాఘవాచార్యులు గారు. ప్రకాశకులు: వెంకటేశ్వర అండుకో, గుంటూరు. వెల. అ. ౮.

### ఆంధ్ర దేశ గ్రామచరిత్ర (మోదుకూరు)

గ్రంథకర్త: కొడాలి లక్ష్మీనారాయణగారు. ప్రకాశకులు: మాడరన్ పబ్లిషర్సు, తెనాలి. అమూల్యము.

### కథలు - గాథలు

ద్వితీయభాగము. రచయిత: దిగవల్లి వెంకటశివరావుగారు, వకీలు, బెజవాడ. వెల రూ. ౨.

### మా కేలోకం

రచయిత: వసంతరావు వెంకటరావుగారు. వెల రు ౧.

### సినిమా జ్వరం

రచయిత: చలంగారు. వెల రూ. ౧

పైరెంటికి ప్రకాశకులు: ప్రతిమాబుక్సు, ఏలూరు.

### తత్త్వామృతము

కవి: వాజపేయయాజుల రామసుబ్బారాయుడు గారు, బి. ఏ., కొల్లాపురం, జటప్రోలు సంస్థానము. వెల రూ. ౧.




Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No, 7, Thambu Chetty St., G. T., Madras. Editor—S. Sambhu Prasad.